





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# బుద్ధుని బొమ్మ





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

## Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఇందులో

# బుద్ధుని బొమ్మ

"ఎంత అందంగా ఉందే బొమ్మ! ఎవరిదీ! "అంది భారతి.

"బుద్ధుడు!"

"చైనా నుంచి తెచ్చిచ్చాడా బొమ్మను మా నాన్నకు చదువు చెప్పినందుకు కానుకగా ఓ విద్యార్థి!"

అంతలో శాంతీ, జయా, సుజాత, రాంగోపాల్, పద్మ, శ్రీధర్ కూడా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ ఆ గదిలోకి వచ్చి, "అమ్మరో! ఎంత ముచ్చటగా ఉందా బొమ్మ! దాన్ని గురించి కాస్త చెబుదూ. తెలుసుకుందామని మనసగుతుంది." అనన్నారు వాళ్లంతా ఒకే గొంతుతో గొల్లున.

"సుమారు రెండున్నర వేల ఏండ్ల నాడు కపిలవస్తుకు దాపున లుంబినీ వనంలో బుద్ధుడు పుట్టాడు. లోకంలో ఆయనంత మంచి వాడె వరూ లేనేలేరట. రాచబిడ్డయి కూడా పేదల బాధలు చూసి కరుణతో కంట తడిపెట్టాడట. భార్య యశోధర, ముద్దుల బిడ్డ రాహుల్‌ను వదలి గయ వద్ద ఏడేండ్లు తపస్సు చేశాడట. జీవ హింస చేయరాదనీ, ప్రాణులన్నిటినీ కనికరంతో కాపాడాలనీ, అందరూ సమానులనీ అన్నాడట. ఆయన చూపిన బాట ఈనాటికీ అందరకూ శ్రీరామ రక్షట". అంది సుభద్ర.



"భేష్! భేష్!" అంది జయ.

అదా! అదొక రాగి పైసా!"

"అదలా ఎందుకుందీ!" అంది సుజాత.

"ఉండమ్మా చెబుతా! ఆ బుద్ధుని బొమ్మ లాంటి కంచు విగ్రహం చైనాలో ఉంది."

ఎక్కడాచైనాలోనా? "అని పద్మ అడిగింది.

"అక్కడేమన దేశానికి హిమాలయాలు పెట్టని కోట. వాటినానుకుని ఉత్తరానున్నదే చైనా!"

"హిమాలయాలంటే గబుక్కుల గుర్తొచ్చింది-దాని మీదున్న ఎవరెస్టు శిఖరాన్ని నలభైఏళ్ళ నాడు తొలిగా టెన్సింగ్ నార్కే ఎక్కిందే కదా!" అనన్నాడు శ్రీధర్.

"ఔనౌను! సరే! ఆ బొమ్మ సంగతి చెప్పబోతుంటే అడ్డు ప్రశ్నలూ - మీరూను - ఆగండర్రా-సాంతం ఆ కథ చెప్పనీయండర్రా!" అని భారతి అంది.

" ఆ దేశంలో అంతటా బుద్ధ విగ్రహాలే! చైనీయులకు ఆయనంటే అమిత అనురాగం. చాంగ్‌టూ అనే ఊళ్ళో అసలా బుద్ధ విగ్రహం నిజంగా ఉంది. ప్రత్యేకం ఓ రాగి పైసా దాని గుండెల మీదుంది. అది ఇద్దరు మనుషుల ఎత్తుంది.:

"ఇంతకూ ఆ బొమ్మ మీద రాగి పైసా ఎందుకుందో చెబుదూ!" అంది శాంతి."

"ఆ దేశంలో" యూటో" అనే బుజ్జి పాప ఉంది. ఆ అమ్మాయిని ఒక పెద్ద ఆసామి ఇంట్లో పాచిపనికి పెట్టారు.

"పాచి పని కెందుకు పెట్టార్రే పాపం ఆ పాపను?" అంది జయ.

"వాళ్లకి సరిగా తినడానికి తిండి చాలక ఆపనికి పంపారు".

"ఊఁ! కొడుతాం- ఆకథ చెబుదూ- పున్నెముంటుంది!" అంది సుజాత.

"అయితే మరి ఆ అమ్మాయి అమాయకంగా ఆ ఆసామి ఇంట్లో పని పాటలన్నీ చేసేది. ఇల్లూ వాకిలీ కసవు ఊడ్చేది: నీళ్లు చల్లేది: ముగ్గులు వేసేది: అంట్లు తోమేది: ఎప్పుడూ ఏదోక పని చేస్తూనే ఉండేది: పగలంతా రెండు కాళ్ళూ ఒక చోట పెట్టేదే కాదు: పని చేయడం పరమానందం ఆ పాపకు.

" యూటో బడికెళ్లి చదువుకోదా?" అంది పద్మ

"ఊహూ ఇంకెక్కడ చదువు! చిన్నప్పటి నుంచి పని చేయవలసి వచ్చింది తిండికోసం. ఓ నాడు తెల తెల్లవారింది. బయట వాకిలి కసవు ఊడుస్తూంది. ఆ పాచిపని చేస్తుండగా చిమ్మే చీపురుకు చటాలున ఏదో తగిలి ఘల్లుమంది. అదేమిటో నని నాలుగు దిశలా చూసింది. ఏదో దూరంగా దొర్లుకుపోయి దుమ్ములో దూరింది. అటూ ఇటూ తెగ తెగ వెదింకిందా పాప. చివరికి దుమ్ములో దూరిన పైసాను పైకి తీసింది యూటో.

" ఆ మకిలిపట్టిన రాగి పైసా నెవరు పారేసుకున్నారో మరి!" అంది శాంతి.

"ఆ ముష్టి పైసా పోయిందని ఎవరు పనిపెట్టుకు వెదుకుతారు!" అంది జయ.

"మీ కబుర్లు కట్టిపెట్టండి! ఆ మంచి కథ చెప్పనీయండర్రా!" అని రాంగోపాల్ అన్నాడు. పూలగౌను చిల్లి జేబులో చెయ్యి దూర్చి. " నా చిల్లి కానీ ఏదీ! ఏమయిందబ్బా!" అని బుంగ మూతి పెట్టింది సుజాత.

"ఉండడర్రా! పానకంలో పుడకల్లాగా కథ నడుమ అడ్డు ప్రశ్నలూ-మీరూనూ!" అంది పద్మ.

'ఆ రాగి పైసా తీసుకుని చటుక్కన బొడ్డులో దోపుకుందా యూటో. అదే పదివేలు దొరికినట్టు మురిసిపోయిందా పాప. కసవు ఊడ్చడం పూర్తయింది. ఆ చిలుము పట్టిన ఆ రాగి పైసాను నీళ్ల తొట్టి వద్దకు తీసుకెళ్ళింది. గబగబా చింత ఉండు పట్టించింది.. కాసేపాగి పైసాను గట్టిగా తోమింది. తోమగా తోమగా అది మిలమిలా మెరిసింది.

"ఆ అమ్మాయి ఆనందానికి అంతే లేదు. ఆ చిల్లి కానీని ఓ నూలు దారంలో గుచ్చి దండలాగ మెడలో వేసుకుంది. రత్నాల హారం వేసుకున్నంతగా సంతసించింది. పని చేసి కూచున్నప్పుడల్లా ఆ దండను చూసుకుని సంబరాలు పడేది. దాన్ని గుప్పెట్లో గట్టిగా పట్టుకుని గుండె మీదుంచుకుని హాయిగా నిదురించేది. పూలూ, పళ్లూ, బొమ్మలూ, గౌన్లూ, మిఠాయిలూ ఇంకెన్నో దానితో కొన్నట్టు పగటి కలలు కనేది.

"ఓ నాడు ఓ బౌద్ధ బిక్షువు ఆ ఊరు వచ్చాడు. అతడు పొట్టిగా పొద్దుగా ఉంటాడు. "సుభద్రక్కా బౌద్ధ బిక్షువంటే ఎవరు?" అని ప్రశ్నించింది.

"తోలు బొమ్మలాటలో కేతిగాడూ, బంగారక్కా లాగా కమ్మని కథ చెబుతూంటే కుంటి ప్రశ్నలూ నువ్వూ్వనూ". అంది భారతి.

"బుద్ధుడు తెలిపిన మంచి నీతుల్ని తేటతెల్లంగా అరటి పండొలిచి పెట్టినట్టు వివరించే వాడే బౌద్ధ బిక్షువు."

"ఓనాడు ఊరి నడిబొడ్డున రచ్చబండ వద్ద పెద్ద సభ జరుగుతుందని తాంటాం వేశారు.

ఇసుక వేస్తే రాలకుండేట్టు చిన్నా పెద్దా అంతా ఆత్రంగా అక్కడ గుమిగూడారు. " ప్రాణుల్ని కనికరించండి. సత్యం పలకండి. పేదల్ని ఆదుకోండి. " అని ఆ బౌద్ధ బిక్షువు చెబుతూంటే నోరు తెరుచుకుని విన్నారంతా. ఆ పిదప అంత మంచి బోధ చేసిన వాని కంచు విగ్రహం పోతపోయించి ఊరి నడిబొడ్డున ఉంచాలని అంతా గట్టి పట్టుపట్టారు.

" నా వంతు వెయ్యి బంగారు కాసులిస్తా!" అన్నాడొక సాహుకారు.

"ఇంట్లో ఉన్న నగలూ, నాణేలూ అన్నీ ఆసామి బొమ్మకే" అన్నాడొక పెద్ద రైతు ఓపిక కొద్దీ బంగారం, వెండీ, నగలూ, నాణేలూ, ఒకటేమిటి విలువయిన వన్నీ తెచ్చికుప్పలు పోశారు.

ఆ రాగి పైసాను కానుకగా ఇద్దామని ఉబలాటంతో ఆ పొట్టి బిక్షువును సమీపించింది యూటో. ఆరాగి కానీని ఆయనకు అందిచ

బోయింది. "ఛీ, ఫో! అవతలికి ఫో! ఎవరికెక్కావాలి నీ చిల్లికానీ!" అని చీదరించి విసరికొట్టాడాయన.

పద్మం లాంటి యూటో చిన్న మోము చిన్నబోయింది. ధగ ధగ మెరిసే ఆ నగల రాశి ముందు ఆ ఎర్రని ఏగాని ఓ లెక్కా!

బుద్ధ విగ్రహం కోసం భిక్షువులు పొరుగూళ్ళ నుంచి కూడా ఎన్నెన్నో విలువయిన నగలూ, నాణేలూ, కానుకలుగా తెచ్చి ఇంకా పెద్ద కుప్ప పోశారు.

ఆ విగ్రహం పోతపోసే వాళ్లను పిలిపించారు. మంచి మూస తయారు చేయించారు. లోహం కరిగించారు. కరిగించిన దాన్ని మూసలో పోయించారు. ఆ మూసను ఒక వారం చల్లబరచారు. దాన్ని ఓ ఉదయం ఎంతో ఉబలాటంతో ఊడదీయించారు. బొమ్మ కుదురుగా కుదిరిందో లేదో నని ఆత్రంతో చూశారు. అయితే ఏం లాభం! విగ్రహం గుండె మీద ఓ పెద్ద సొట్ట బడింది. దాన్ని చూసిన వాళ్లందరి గుండెలు గుభేలు మన్నాయి."

"అప్పుడేం చేశారు? సుభద్రాక్కా" అనన్నాడు శ్రీధర్.

"మళ్లీ మర్నాడు మరి కొంత కొత్త లోహం కలిపి కలిగించి పోత పోశారు. ఈ సారి బొమ్మ ఒళ్లంతా చారలతో గీరలతో గీరుకుపోయింది. అలా ఎన్నో మార్లు రకరకాల లోహపు పాళ్లు మార్చి మార్చి కరిగించి పోతపోయించారు. అహా! విగ్రహం అందంగా తయారు కాలేదని తెగ దిగులు పడ్డరా భిక్షువులు. ఏం చేస్తే అది కుదురుగా రూపం దాలుస్తుందా అని అధికంగా ఆలోచించారు. బుర్రలు వేడెక్కాయి.

" ప్రేమతో, దయతో, మంచి మనసుతో అందరూ కానుకలిచ్చారా? అట్లా అయితే విగ్రహం ముచ్చటగా ఉండేదే! అందులో లోపం ఏదో జరిగుండాలి. బాగా ఆలోచించండి", అని పెద్ద భిక్షువు అన్నాడు.

"కానుకలంతా మంచి మనసుతోనే ఇచ్చారు". అని భిక్షువులంతా జవాబిచ్చారు. అయితే ఆ పొట్టి భిక్షువు మాత్రం నాలుక కరుచుకున్నాడు.

"ఛీ, ఫో! అవతలికి ఫో; నీ డబ్బూ చిల్లికాని ఎవరిక్కావాలి: నువుబాగా తెచ్చావ్ ఓ పైసా! " అని చీదరించి విసిరి కొట్టిన ఆ అమ్మాయి పైసా సంగతి కళ్లకు కట్టింది. అందర్నీ తోసుకుని ముందుకొచ్చి ఆ పెద్ద భిక్షువు పాదాల మీద మోకరిల్లి, "చేసిన తప్పుకు మన్నించండి సామీ!" అని మొరపెట్టుకున్నాడా భిక్షువు.

" ఆ బుజ్జి పాప మనసెంత నొచ్చుకుందో! అంత ప్రేమతో, భక్తితో ఇస్తానన్న కానుక చిన్న పైసా అని చీదరించి విసరికొట్టడం పెద్ద తప్పు! ఆ పాప ఎక్కడున్నా వెదికి ఆ పైసా కానుక తీసుకురా! ఆ కానుక అన్నిటికన్న గొప్పది. అపుడు విగ్రహం అందంగా అలరారుతుంది!" అని బౌద్ధ పెద్ద అన్నాడు.

యూటోను వెదకుతూ ఊరూరు తిరిగాడు. కొంప కొంప గాలించాడు. కనుపించిన చిరిగిన గౌను అమ్మాయిలనమందరినీ తేరిపార చూశాడు. అయితే ఆ అమ్మాయి అగుపిస్తేగామరి!

తిరిగి తిరిగి కాళ్లు కండెలు కట్టాయి. అలసట వచ్చింది. లాభంలేదు. ఇక వెదకడం మానేద్దామనుకున్నాడు. అయినా ఆఖరి సారి ప్రయత్నం చేద్దామని గుడిసె గుడిసె వెదికాడు. ఎక్కడగుపిస్తుందా పేద పిల్ల!

ఆశలు వదులుకున్నాడు. ఎంతో దిగులుతో, నిరాశతో గుండెలు బరువెక్కాయి. ఎంతో బాధ పడ్డాడు. అంతలో ఓ సాహుకారు గుమ్మంలో తళక్కున మెరిసిందా చక్కని చుక్క ఆ పాపను చూసి ఆనందంతో పరవళ్లు తొక్కాడు భిక్షువు.

"చిట్టి తల్లీ! బంగారు పాపా! ఆ పైసా కానుక ఇస్తావమ్మా! దాన్ని విగ్రహమూసలో వేసి పోతపోస్తే అందచందాలతో అలరారుతుందా బుద్ధ విగ్రహం!"

అని యూటాను బతిమిలాడాడు.

అంతకన్నా కావలసిందేముందీ యూటోకు. కొండెక్కినంత సంతోషించింది. "ఆ! సరే!" అంటూ ఆ రాగి పైసాను కళ్ళకద్దుకుంది. ప్రేమతో ఆ పైసాను అతని దోసిట్లో ఉంచింది. సలసల కాగే లోహపు మూసలో

దాన్ని వేశారు. కలిగిన లోహాన్ని మూసలో పోశారు. సుందర విగ్రహం కోసం వేయికళ్ళతో అంతా ఎదురుచూస్తున్నారు. ఆ కరిగిన లోహం గట్టిపడడానికి ఓ వారం పట్టింది.

క్షణమొక గడియగా జనం కళ్ళల్లో వత్తులు వేసి ఉన్నారు. బుద్ధ విగ్రహపు మూసవిప్పారు. చిరునవ్వులు చిందిస్తూ మిలమిలమెరిసిందా విగ్రహం. దాని గుండె మీద తళతళలాడిందా రాగిపైసా!

"అదే ఆ బుద్ధ విగ్రహం!"

"ఆ తర్వాత ఏమైందీ సుభద్రక్కా!"

"ఆ అమ్మాయి సంగతి ఎవరికీ తెలియదు. ఆ పెద్ద విగ్రహాన్ని చూడ నేల నాలుగు చెరగుల నుంచీ ఈ నాటికీ జనం వెళుతూనే ఉన్నారు.! చూసిన వాళ్లంతా ఆ బుద్ధుని గుండెమీదున్న ఆ రాగి పైసా ఏమిటని వింతగా అడుగుతూనే ఉన్నారు! ఆ పేద పిల్ల యూటో ప్రేమతో ఇచ్చిన కానుకని ఆ కథంతా పూసగుచ్చినట్టు చెప్పుకుని సంబరాలు పడతారట అక్కడివాళ్లు.

"సుభద్రక్కా ఇదంతా నీకెలా తెలుసు?"

"చదువుల గదిలో ఉన్న ఒకే ఒక బొమ్మను గురించి నాన్న చెప్పగావిన్నాను. ఆయనకు బుద్ధుడు అంటే పంచ ప్రాణాలు". ఆ తర్వాత పిల్లలు ఒకరి కళ్లల్లోకి మరొకరు చూస్తూ మాటాడక మూగబోయిన బొమ్మల్లా కూచుండి పోయారు. వాళ్ళ కళ్ళు చుక్కల్లా మిలమిల మెరిశాయి. ఏదో తెలిసినట్టుగా! ఇప్పుడా పిల్లలకు బుద్ధుడు -యూటో అంటేఎంతో గౌరవం. వాళ్లంటే ఎంతో గురి. ఆ కథ అందరికీ చెప్పి ఆనందిస్తూంటారా పిల్లలు ఈ నాటికీ!.

***

# తెలివి

"ఎక్కడనుంచిరావస్తున్నావు?"

" మా మేనత్తగారింటి నుంచి."

" ఏ పేటలో ఉందా ఇల్లు?"

"సోమవారపు పేట ..ఆహా.. కాదు, శుక్రవారం పేటో- ఏ పేటో మరిచే పోయాను!"

"అంకమ్మగుడి ఉంది. ఆ పేటేనా?"

"ఔను!"

" అయితే అది ఆదివారపు పేటరా!"

"సరే.. నేను తొందరగా పోవాలి."

" ఏవిటా తొందర?"

" మా మేనత్త ఓ పంచదార చిలక ఇచ్చింది. దాన్ని జాగ్రత్తగా తీసుకువెళ్లాలి. సగం మా చెల్లికి ఇవ్వాలి. మిగతా సగం నే తినాలి."

" ఐతే వెళ్లు."



ఇక వీరన్న అక్కడ నిలబడలేదు. గబగబా పరుగు తీశాడు. అత్త ఇచ్చిన పంచదారచిలకని గుప్పిటలో బిగించాడు. అదికాస్తా ముక్కలుముక్కలయి పిప్పి పిప్పిగా అయిపోతోంది. ఆ సంగతి వీరన్నకు తెలియనే తెలీదు.

వీరన్న దోవ చూసుకోడు. ఒకటే పరుగు లంకించుకున్నాడు. ఏం జరిగిందీ? రోడ్డు మీద ఓ అరటి తొక్క పడింది. ఎవరో అక్కడ పడేశారు. దాని మీద వీరన్న కాలు వేశాడు. జర్రున జారింది. పక్కనే మురుగుకాల్వ. దానిలో వీరన్న మునిగాడు. తెల్లని బట్టలు నల్లగా అయినవి. ఒంటి నిండా బురదా- కంపూ. అబ్బబ్బా!

వీరన్న గుప్పెట్లో ఉన్న పంచదార చిలకను మాత్రం వదల్లేదు. ఏడుస్తూనే ఇంటికి వెళ్లాడు.

వీరన్నను చూసి తల్లి జాలిపడింది.

"అత్త ఇచ్చిన తాయలం ఏమయిందీ?" అనడిగింది తల్లి. "ఇదుగో" అంటూ గుప్పెట తెరిచాడు వీరన్న. ఏముందీ? ఏమీ లేదు.

"అత్తపంచదార చిలక ఇచ్చి, ఇంటికి వెళ్లేదాకా గుప్పెడు తెరవ వద్దంది. " అన్నాడు వీరన్న.

'మురికి కాల్వలో పడినపుడు పంచదార చిలక కరిగి పోయింది." అని తల్లి గ్రహించింది.

"తెలివి తక్కువ తండ్రీ! అత్త ఏదన్నా వస్తువు ఇస్తే చక్కగా కాగితం లో చుట్టి జేబులో పెట్టుకుని రావాలి, తెలిసిందా?" అంది తల్లి.

' ఆ అలాగే' అన్నాడు వీరన్న.

- 2 -

మళ్లా ఆదివారం నాడు వీరన్న మేనత్త గారింటికి వెళ్లాడు. ప్రతి ఆదివారం అక్కడికి వెళ్లడం మామూలే ! అవాళ వీరన్న కడుపు నిండా పూస మిఠాయిలు పెట్టింది మేనత్త.

ఇంటికి వెళ్లే ముందు మేనత్త వెన్నపూస తెచ్చి "జాగర్తగా ఇంటికి పట్టుకపో" అని చెప్పిఇచ్చింది. "సరే !" నన్నాడు వీరన్న. వీరన్న కోసం తల్లి ఎదురు చూస_ ౦ది. రాగానే పరీక్షగా చూసింది వాడిలాగూ,కాళ్లూ అన్నీ చమురుతో తడిసి చూడరోతగా ఉన్నవి.

"చొక్కాలాగూ వొళ్లూ అంతా ఆ చమురేమిటి? అత్త ఏమిచ్చింది రా?"

"అమ్మా! అత్తయ్య వెన్న ముద్ద ఇచ్చింది. నీవు మొన్న చెప్పావుగా! అందుకే ఇవాళ కాగితంలో చుట్టి లాగు జేబులో పెట్టుకొచ్చా!" అన్నాడు వీరన్న.

"ఇటివ్వు" అన్నది తల్లి.

వీరన్న లాగు జేబులో చెయ్యి పెట్టాడు. ఏముందీ? అదంతా కరిగి ఒంటి నిండా జిడ్డు పట్టింది.

" ఇంత తెలివి తక్కువ తండ్రివయ్యావేరా? వెన్న ముద్దని జేబులో పెట్టుకొస్తారా? ఆకులో పెట్టి, చక్కగా చేతిలో పట్టుకు రావాలి?" అని అంది తల్లి.

" ఈసారి అలాగే చేస్తానమ్మా!" అన్నాడు వీరన్న.

- 3 -

మళ్లా ఆదివారం రానూ వచ్చింది. వీరన్న మేనత్త ఇంటికి వెళ్లనూ వెళ్లాడు. సంత నుంచి తెచ్చిన రంగద్దాల కళ్ళజోడూ, చారల చొక్కాతో చూడముచ్చటగా ఉన్నాడు. క్రాపు నున్నగా దువ్వాడు. వీరన్నని చూసి మేనత్త కులాసాగా నవ్వింది. చిరుతిండి పెట్టింది. తిన్నాడు వీరన్న.

ఇంటికి వెళ్లే ముందు వీరన్న "అత్తయ్యా! మా ఇంట్లో ఎలుకల గోల జాస్తిగా ఉంది. ఓ పిల్లికూన తెమ్మంది అమ్మ" అని మేనత్తతో చెప్పాడు.

"మా నల్ల పిల్లి పిల్లలున్నాయి. గాదె చాటున ఉన్నాయి. ఒక పిల్లిని తీసుకు వెళుదువుగానిలే" అని అన్నది మేనత్త.

ఆ తర్వాత మేనత్త ఏదో పని మీద పొరుగింటికి వెళ్లింది. వీరన్న గాదె చాటుకి వెళ్లి చూశాడు. పిల్లి కూనలు ఇంకా కళ్ళు విప్పనే లేదు. అమ్మ చెప్పిన మాట గుర్తుకు వచ్చి వీరన్న ఓ పిల్లి కూనను ఆకుల్లో చుట్టాడు. పురికొసతో బిగించాడు. చిన్న మూటగా తయారయింది. దాన్ని తీసుకుని బయల్దేరాడు.

దోవలో పందులు పొర్లాడే ఒక గుంట కనిపించింది. మూట్లలో ఉన్న పిల్లికూన ఎండిపోతుందేమో నన్న అనుమానం వచ్చింది. పిల్లి కూనని ఆ గుంటలో ముంచి తడిపాడు. "కుయ్ కుయ్" మన్నది పిల్లి. మరో సారి ఆ మురికి నీళ్ళలో ముంచి ఇంటి దోవ పట్టాడు వీరన్న.

తల్లి ఎదురుగా వచ్చి వాడిచేతిలో మూటని చూసింది. విసుక్కుంటూ మూట ఊడదీసింది. ఏముందీ? చచ్చిన పిల్లికూన. ప్రాణం ఉసూరు మంది అమ్మకు.

తాను చేసిన పని మొత్తం బీరు పోకుండా చెప్పాడు వీరన్న. "పిచ్చినాయనా! పిల్లి కూనని మూట కట్టి తెస్తారటరా? నీళ్ళలో తడు పుతారా? ఇదుగో ఇక మీదట అత్తయ్య ఏమిచ్చినా జాగర్తగాతే! పిల్లికూన ఉందనుకో! దాని మెడకోతాడు కట్టి తీసుకురావాలి. తెలి సిందా?" అంది తల్లి.

- 4 -

తర్వాత ఆదివారం నాడు వీరన్న మేనత్త గారింటికి వెళ్ళే ముందు ఓ పురికొస జేబులో పెట్టుకున్నాడు. ఈ సారి అయినా మేనత్త ఇచ్చే తాయిలాన్ని జాగర్తగా తెచ్చి అమ్మకు ఇచ్చి మెప్పు పొందాలను కున్నాడు వీరన్న.

మేనత్త వీరన్నను నాలుగు జిలేబీలు పళ్లెంలో పెట్టి తినమంది. వాడు తింటునట్టు నటించాడు. మేనత్త పెరట్లోకి వెళ్లగానే, ఆనాలుగింటిని పుచ్చుకుని వీరన్న బజార్లోకి వచ్చేశాడు. అక్కడ నిలబడి అమ్మ చెప్పిన మాటల్ని గుర్తు తెచ్చుకున్నాడు. నాలుగు జిలేబీలకూ పురికొస కొస ముడేసి, ఒక వైపు చేత్తో పుచ్చుకున్నాడు. తాటాకు బండిని ఈడ్చుకు పోయినట్టు ఇంటికి వాటిని ఈడ్చుకుపోయాడు. వెనక్కి తిరిగి చూడలేదు. ఇంట్లోకి వెళ్లాడు.

" అత్తయ్య ఏం ఇచ్చిందిరా?" అనడిగింది అమ్మ.

"జిలేబి"

"ఏది?"

"ఇదిగో" అంటూ వీరన్న పురికొస లాగి చూపాడు. జిలేబి ఎక్క డుందీ! రోడ్డు మీద ఎక్కడ దుమ్ములో కలిసిపోయిందో! జరిగిన విషయం తెలుసుకుని అమ్మ మరి ఏమీ మాటడలేదు. వీరన్న కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఐతే, వీరన్నకి తెలివి ఉన్నట్టా? లేనట్టా? మీరే తేల్చి చెప్పాలి సుమా!.

***

# ఎత్తుకు పై ఎత్తు

"రైతన్న! ఎందాకా? సంతకా? నేనూ వస్తున్నా- దబ్బున నాతో నడవగలవా? కాస్త ఆగు; పిల్లా జెల్లా బాగున్నారా?" అని దారిలో కలిసిన షావుకారు సుబ్బయ్య అడిగాడు.

"నిన్ను చూడడం ఎంతో అదృష్టం. కలిసి కబుర్లు చెబుతూ కదలి పోతుంటే ఎంత దూరమైనా ఇట్టే కుంచించుక పోతుంది; హాయిగా ఉంటుంది. ఊరక నడిస్తే ఏం ఊసుబోతుందీ? అందులో మజా ఏముందీ? నువ్వు గనక ఊ అంటే పందెం వేసుకుందాం. ఎవరూ ఊహించనీ, నమ్మనీ కథలు చెప్పుకుందాం దారంతా నడుద్దాం. అదెట్లా, ఇదెట్లా అని అడ్డు ప్రశ్నలు గడ్డు ప్రశ్నలు వేయరాదు. ఏం చెప్పినా గుడ్డిగా నమ్మాలిసిందే సుమా! ఎవరయితే అనుమానాలు అడుగుతాడో అతడు వెయ్యి రూపాయిలు ఎదుట వానికివ్వాలి. సవాల్!" అనన్నాడా షావుకారు మాయమాటలతో అమాయకపు రైతును బోల్తా కొట్టించాలను కుంటూ.



"ఎంత నమ్మరాని కథయినా మీరు మాటాడక సందేహం వెలి బుచ్చరాదా? సరే; అలాగే; అయితే మనలో మీరు పెద్దగదా! ముందు మీరు కథ మొదలు పెట్టండి. ఊ కొట్టడం నా వంతు,"అనన్నాడా రైతు బింకంగా.

"మునుపు ఈ బాటనే పోయే ఒంటెల గుంపును ఓసారి చూశా." అనన్నాడా షావుకారు.

" ఆహా! ఊ ఊ!" అనన్నాడా రైతు.

"ఆ ఒంటెలు ఎన్ననుకున్నావ్? పదా-పరకా- ఆహా కానేకాదు- నూటొక్కటి. అందులో మొదటి దాని తోకకు రెండో దాని ముక్కుకు తాడుతో కలిపి కట్టారు. రెండో దాని తోకకు మూడోదాని ముక్కుకు కలిపి కట్టారు. అలాగే వరుసగా కట్టున్న ఒంటెల బారు మైలున్నర పొడుగుంది." అనన్నాడు సుబ్బయ్య.

"భేష్!భేష్! అంత పొడుగున్న ఒంటెల బారు నేనెప్పుడన్నా చూస్తే బాగుండు అయితే ఆ తర్వాత" అనన్నాడా రైతు.

"అంతలో ఆకస్మాత్తుగా ఆకాశంలో ఎగిరే గద్ద ఒకటి నేలమీదికి చూసింది. ఆ ఒంటెల బారును చూసి చటుక్కున దాని పైవాలిందా గద్ద. వాలీ వాలడంతోనే ఆ ఒంటెల్ని ముక్కుతో కరచుకుని అమాంతం రయ్యిన నింగిలోకి ఎగిరిందా గద్ద. ఆ ఒంటెల బారంతా ఆ గద్ద ముక్కునుంచి కిందికి వేళ్ళాడాయి. నేను చెప్పేదేమన్నా అనుమానంగా ఉందా?" అనన్నాడా సాహుకారు.

" ఎంత అబ్బురం! ఎంత అబ్బురం! అబ్బా! అ గద్దెంత సత్తా కలదో మరీ! అయితే ఆ తర్వాత ఏమయిందీ?" అనన్నాడా రైతు.

" ఆ ఆ ఏమయిందనుకున్నావ్? అప్పుడొక రాకుమార్తె ఓ ఉద్యానవనంలో చెలికత్తెలతో షికార్లు చేస్తూంది. సరదాగా ఆడుతూ, పాడుతూ ఆకాశం వైపు తలపైకెత్తి చూసిందామె. ఎగిరే గద్ద ముక్కు నుంచి వేలాడే నూటొక్క ఒంటెల బారు అగుపించాయి. ఆ వింత ఆమె చూస్తుండగానే ఆ గద్ద ముక్కున పట్టుకున్న ఒంటె బాధతో తన్నుకుంది. ఆ అదురుకు

దాని ముక్కునున్న ఒంటెె కాస్తా పట్టు తప్పింది. దానితో బాటు ఆ ఒంటెల బారంతా అమాంతం రాకుమారి కుడి కంట్లో పడ్డాయి. " అని తెగ చెప్పేకుపోతున్నాడా షావుకారు. " కుయ్ కుయ్ అనక అన్ని ఒంటెల్ని భరించడం అత్యద్భుతం. ఆ పిదప ఆమె ఏంచేసింది?" అనన్నాడా రైతు.

" ఏదో సన్న నలుసు కంట్లో పడ్డట్టుంది. "అనంటూ కన్ను నల చుకుంటూ చెలికత్తెలకు చెప్పింది. అపుడొక చెలికత్తె ఆమె కంటికి ఆవిరి పట్టింది. కనురెప్ప మీద కుడి చేతివేలితో నిమిరింది. చివాలున ఒంటె ఒకటి కంట్లో నుంచి బయట పడింది. దాన్ని తన పోకల సంచిలో పడేసుకుందా చెలికత్తె. మళ్లీ కంటి రెప్పమీద వేలితో నిమిరి మిగతా వంద ఒంటెల్నీ ఒకదాని తర్వాత మరొక దాన్నీ తీసి తన సంచిలో కుక్కుకుందామె!" అనన్నాడా షావుకారు.

"భేష్! భేష్! బలే బాగుందే కథ! ఎంత వింత ! అనక ఏమయిందీ?" అని రైతన్నాడు

" ఆ పిదప ఏమయిందో ఏమో! నాకేం తెలీదు. ఇక కథ చెప్పడం నీ వంతు. నోరూరించే మాంచి కథ చెప్పాలి సుమా!" అనడిగాడా షావుకారు

" మా నాయన ఓ మోతుబరి రైతు. ఆవులూ, గేదెలూ, గొర్రెలూ, మేకలూ మందలు మందలుగా ఉండేనాయనకు. అరవై యకరాల వ్యవ సాయం, మూడొందల మంది పాలేర్లు, అన్నీ ఉన్నా ఆయనకు ఓ పొట్టి గుర్రం అంటే పడిచచ్చేవాడు. అదంటే బలే మోజు!" అనన్నాడా రైతు "అయితే మీ అయ్య అదెక్కి దేశమంతా చకచకా షికార్లు ఎజిసొచ్చేవాడా?" అనన్నాడా షావుకారు.

"ఓసారి చాలా దూరపు ఊరు నుంచి తిరిగొస్తుండగా చిరిగిన జీను రాచుకుని ఆ గుర్రం వీపు ఒరుసుకుంది. అది దోక్కుపోయి అరచేయంత మేర గాయమయింది.". అనన్నాడా రైతు.

"ఊఁ ఊఁ బలే పసందుగా ఉందీ కథా! ఆ తరవాత ఏమయిందీ?" అనన్నాడు షావుకారు.

" ఆ ఏడాది తొలకరివానలతో బాటు గాలి దుమారాలు జాస్తిగా వచ్చాయి. ఓ దుమారంలో దుమ్మూ ధూళీ ఎగిరొచ్చి ఆ గుర్రపు వీపు మీద గాయంలో పడ్డాయి. ఆ దుమ్ము తో బాటు వరివిత్తనాలు కూడా అందులో కూరుకు పోయాయి. ఎండావాన, దుమ్ముకు ఆగింజలు మొల కెత్తాయి. " అన్నాడా రైతు.

" భలే! భలే! బాగుందీ కథ. ఆ మొక్కలు పెరిగి బంగారు పంట పండిందన్నమాట" అన్నాడా షావుకారు అదోరకంగా మొగం పెట్టి బిక్కపోతూ.

"ఆ ఆ!ఆ గుర్రపు వీపు మీద ఏపుగా ఎదిగిన వరి పంటను కోసి కుప్పేశారు. దాన్ని ఐదొందల మంది కూలీలు నూర్చారు. నీ నోటి మాట పున్నేన ఆరొందల బస్తాల పంట పండింది" అన్నాడా రైతు.

" మీ తండ్రి మా నాయన వద్దకు చేతులు ముడుచుకు వచ్చి వంగి వంగి దణ్ణాలు పెట్టాడు. ఈ ఏడు వ్యాపారం లో నష్టం వచ్చింది. తిండి గింజలకు కటకటగా ఉంది. ఇంటిల్లి పాదీ పస్తులు. ఐదు బస్తాల ధాన్యం బదులివ్వు. బస్తాకు వెయ్యి రూపాయల వంతున పైకం రాగానే బాకీ తీరుస్తా?" అని తెగ బతిమిలాడాడు.

"దస్తా వేజు రాసిస్తానన్నా వద్దని ధాన్యం ఐదు బస్తాలు కొలి చిచ్చాడు మాతండ్రి అది సంగతి!"

" అయితే మీ అయ్య ఈ నాటికీ ఆ బాకీ తీరిస్తే ఒట్టు. వీలును బట్టి అప్పు తీరుస్తాడని మా తండ్రి తాత్సారం చేశాడు. ఇపుడు నీవు షావు కారువు గదా! అడగ కుండానే అప్పు అసలు ఫాయిదాలతో తీరుస్తావని ఇంతకాలం ఓపిక పట్టా. మరియాద మన్నన కలవాడివి కదా! ఇప్పు డయినా అసలివ్వు. వడ్డీ ఇవ్వక పోతే మానేలే!" అనన్నాడా రైతు.

"అప్పెడా ధాన్యం తీసుకోవలసిన అవసరం మా కెందుకొచ్చిందీ! ఆ మాట ఏఒక్కసారన్నా మా నాయన చెప్పనే లేదే!" అని గొణిగాడా షావుకారు. అతని కాళ్ల కింద నేలకదిలి పోతున్నట్టుంది.

" ఏం మాట్లాడవేం? బెల్లం కొట్టిన రాయిలాగా అని దబాయించాడా రైతు.

"ధాన్యమయితే ఐదు బస్తాలతోనే సరిపోతుంది. పందెం అయితే వేయి రూపాయలివ్వాలి!

"ఏదిచౌకా!" అని ఆలోచనలో పడ్డాడా షావుకారు.

"ఐతే ధాన్యం ఇవ్వనా? లేక డబ్బు ఇవ్వనా?" అని ఏదీ పాలుపోక, " ధాన్యమిచ్చే మీ బాకీ తీర్చుకుంటా. పందెం ఓడిపోయాను" అనన్నాడా బోల్తాకొట్టిన షావుకారు ఉసూరుమంటూ.

ఆ ప్రాంతంలో ఎవరికయినా బాకీ పడితే అప్పులవాడ్ని "ధాన్యమయినా ఇవ్వు లేకుంటే డబ్బైనా ఇవ్వు!" అని నవ్వుకుంటూ ఈ కథ చెప్పుకుంటారట అక్కడి వాళ్లు నేటికీ-

***

# వింత యాత్ర

ఆరేళ్ళ అరుణ మంచి పిల్లే అయితే వట్టి పిరికిది. ఊరకనే జారిపడి బావురుమని ఏడ్వడం రివాజు. బూచీలంటే మరీ దడుచుకుంటుంది. కుక్కల్ని చూస్తే మరీ గజగజ వణికి పోతోంది.

రోజూ బడికిపోతూ వీధి మలుపునున్న ఊరకుక్కను చూసి ఆమె గుండె గుభేలుమనడంతో దాని కనుచాటుగా గోడ పక్కగా నక్కి నక్కి నిదానంగా జారుకునేది.

దొంగచాటుగా అడుగులో అడుగేస్తూ పోతున్న ఆమెను ఆ కుక్క చూడనే చూసింది. "భౌ భౌ" మని మొరుగుతూ వెంట పడనే పడ్డది.

అదృష్ట వశాత్తు అటుగా సైకిల్ మీద పోయే పోలయ్య ఆ కుక్కను అవతలికి తోలి ఉలిక్కిపడిన ఆమెను సముదాయించాడు.



అమ్మాకి నాన్నా పొలం వెడుతూ ఇల్లూ వాకిలీ చూస్తూండమన్నారు. మొక్కజొన్న కండె కాల్చుకు తింటూ ముంగిట జామ చెట్టి కింద కూచొని. " ఇంత పిరికి దానవేమ్మా!" అని సావాస గాళ్లు ఆటలు పట్టిస్తారని కంట తడిబెట్టింది.

అంతలో ఓ ఎర్రచీమ ఆగాగి చెట్టుపైకి పాకిపోవడం చూసి " అదెందుకు నడుమ నడుమ ఆగుతుందబ్బా! నా లాగే అదీ పిరికిదా?" అనుకుంటుందామె.

చట్టుక్కున ఓ వింత సంగతి అపుడు జరిగింది. ఆమెను చూసి జాలితో ఆ ఎర్రచీమ ఏదో గుసగుస లాడింది. " కాస్త బిగ్గరగా చెప్పు వినిపించేట్టుమరి!" అనంది అరుణ.

చెట్టుకు మరీ దాపు కామె నడిచింది. చీమ పక్కన చెలి నుంచి " ఎందుకు ఎగ్గొట్టేశావు బడి?" అ అనిందా చీమ.

"తెలిస్తే చెప్పు - మరి పిరికితనం ఎట్లాపోతుందో?" అనందామె. "పిరికితనం రోత. అన్నీ తెలిసిన ఓ గొప్ప మునున్నాడు. ఆయన వద్దకు వెడదాం. నీ అనుమానం వివరంగా విని పిరికి తనానికి విరుగుడు అరటి పండొలిచి చేతిలో పెట్టినట్టుగా ఉన్నదున్నట్టు చెప్తాడు." అని చెప్పిందా చీమ.

"సెభాష్! భళా భళీ! సరే వెంటనే వెడదాం". అని అమ్మాయి అంది. " దీన్ని నెత్తిన పెట్టుకో!" అని తన బుజ్జి జేబు నుంచి బుల్లి టోపీ తీసి ఆమె తల మీద ఉంచిందా చీమ.

" అంత చిన్న టోపీ నాకెట్లా సరిపోతుందీ!" అని సణుగుకుంటూ ఉండగానే " ఆహాహా! ఆమె తటాలున చిన్న చిన్నగా కుంచించుక పోయి పోయి చీమంతయింది. ఎంత వింత! ఏం చిత్రం! అప్పుడా టోపీ ఆమె తలకు కచ్చితంగా ఇమిడింది. చీమంతయిన ఆమెకు అన్నీ పెద్ద పెద్దవిగా అగుపిస్తోన్నాయి. గడ్డి పరకల్లో తాను మునిగిపోతోంది. చిన్న చిన్ని గుంటలు పెద్ద సరస్సులయ్యాయి.ఆమె చూపుల్లో మట్టి కుప్పలు పెద్ద పర్వతాలయ్యాయి. ఆమె దాపుకు వచ్చి ఎర్రచీమ ఇలా అంది." మా

చీమల అంద చందాల పుట్టలు. మా సంఘ జీవనం చూడొచ్చు నాతో వొచ్చి!"

" ఎవరీ పరాయి చీమ? నీ వెంట ఎందుకొచ్చింది?" అని ఇతర చీమలు నిలదీశాయి ఎఱ్ఱచీమను.

చీమల పుట్టలు మురికిగా చీకటిగా ఉంటాయనుకుందామె. తీరా చూస్తే అందంగా శుభ్రంగా బారులు తీర్చిన బజారుతో చూడ ముచ్చటగా ఉన్నాయి. అక్కడి వాళ్ళంతా నడుములు వంచి కష్టపడి పనులు చేస్తూ తిండి సంపాదిస్తున్నారు రేపటి బంగారు కాలం కోసం.

" ఓయోయ్

ఒకరి కంటె మరొకరు

ఒళ్ళు వొంచి పని చేయండోయ్

ఓయోయ్

ఎవరికీ భయపడకండోయ్

ఎల్లరూ ధైర్యం కూడ బలకండోయ్

ఓయోయ్

ఏదేమయినా హాయిగా బతకండోయ్

అన్యాయాన్ని ఎదిరించీ

కలిసి మెలిసి ముందుకు అడుగేయండోయ్

ఓయోయ్." అని పదం పాడుతూ కదం తొక్కుతూ చీమల బారులు తిండి గింజల్ని చేరవేస్తున్నాయి. ఆ పాట ఆమె మనసుకు నచ్చింది. అందుకే వాటితో కలిసిపోయింది.

ఓ గింజను గిరుక్కున గిరాటేసిందా ఎఱ్ఱచీమ. అయితే దాన్ని పయికెత్తలేక సతమతమయింది అరుణ. ఆ గింజను ఆమె వీపుమీద కెత్తుకోవడానికి సాయం చేసిందా ఎఱ్ఱచీమ. అలా ఐదారు గింజల్ని రొప్పుతూ రోజుతూ మోసే సరికి ఆ పని సులువయింది. మొదట అలసటగా ఉన్నా తరవాత ఆ పని చేయడం ఆటలాగా అలవాటయింది.

గింజలు గూటికి చేర్చడం చీమల పెద్ద ఎదుటకు రాగానే అరుణను తీసుకు వెళ్లి పరిచయం చేసింది. సంగతంతా అక్షరం వదలక తెలిపి, " పిరికి తనానికి విరుగుడేదో చెప్పి పున్నెం కట్టుకోండి." అని చీమ అంది. " తొమ్మిదో పుట్ట దాపునున్న నత్త గుల్లలో కునుకు తీస్తోంటాడు. ఓ గొప్ప ముని. దబ్బున పోండి." అని ఆ చీమల పెద్ద అంది. వంకర టింకర మెలికల దారిన గడ్డి దుబ్బుల్లోని తొమ్మిదో పుట్టవద్దకు చేరారిద్దరు. "ఏమండీ! ఏమండీ!" అని కేకలేశారు. "ఎవరక్కడ" అని చటీ చటీ చప్పుడయిందా నత్తగుల్ల నుంచి " ఎలా ధైర్యం వస్తుందీ-సెలవీయండీ!" అని అందామె.

" నాకేం తెలుసు? సగం తల బయట పెట్టడానికే జంకుతున్నా!"

అని లటుక్కున అందొక నత్తతల

అది చూసి ఆమె నిట్టూర్చింది. " అసలా గొప్ప మునెక్కడుంటాడో తేలిందాకా వెదకుదాం"అందా ఎర్రచీమ.

అలా పోగా పోగా చిట్టచివరకు ఓ రాతి తిప్ప వెనక దాక్కున్న ఓ నత్క గుల్ల నుంచి 'గుర్ గుర్' మని గురక మోత వినబడుతుంది. రవంత జాగర్తగా ఈ సారి ఆ గవ్వలోకి తొంగి చూసింది. మొద్దు నిదురపోతూన్న ఓ తాత కనుపించాడు. అతడే ఆ గొప్ప ముని అనుకుంది అరుణ.

" ఏమండీ! ఏమండీ!" అని అరచింది అరుణ. ఆ అలికిడికి ఆతాత ఆవులిస్తూ చిటికలేస్తూ లేచికూచుని," ఏం కావాలి?' అనన్నాడు. ఆయన పాదాలకు దణ్ణం పెట్టి, " నేనసలు పిరికిపందను. ధైర్యం నాకెట్లా అబ్బుతుంది" అని వినయంగాఅడిగింది అరుణ.

" పులి కన్నా పిరికి దానివే! అయితే తందువా చేపకన్నా గొప్పమొనగత్తెవు-నీవు. ఏమనుకుంటున్నావ్- నీ సత్తా నీకు తెలియడం లేదు!" అని చేతులు తెగ తిప్పుతూ అన్నాడు ఆ ముని.

" అయితే అంతా నన్ను పిరికి పిల్లంటారెందుకో మరి?" అంది అరుణ." అది నాకేం తెలుసు!" అన్నాడాయన."మీకు గొప్పమునికాదన్న మాట!" అని ఒకే సారి ఆ ఇద్దరూ అన్నారు.

" నా అన్న ఆ గొప్పమునీ! ఆయన్నడగండి. ఆయన పోలిక నేనుండడం చూసి అంతా తికమకపడినా వద్దకొచ్చిన గాబరా పెడ్తాం టారు." అని జవాబిచ్చాడా తాత.

" మరీ ఎక్కడుంటాడు మీ పెద్దఅన్న?" అని అడిగిందా ఎర్రచీమ.

" ఆ బూరుగు చెట్టునడగండి " అనన్నాడా తాత.

" సలాం! వెళ్లివొస్తాం తాతా!" అని అంటూ గబగబా బూరుగు చెట్టు దాపుకు చేరారిద్దరూ.

ఆచెట్టు బోదె- కళ్ళూ, ముక్కూ, నోరూ, చెవులూ ఆకారంగా ఉంది. దానికి చెడ్డ చెముడు. దాని దాపు కెళ్ళి " ఆ గొప్ప ముని ఎక్కడుంటారు?" అని ప్రశ్నించారిద్దరూ.

" ఆ, ఆ ఆ నదికి ఆవలి అంచున ఉంటాడని నా వేళ్లు అంటున్నాయి." అనందా బూరుగు.

వంతెన గానీ, పడవగానీ లేవే, ఆనదిని దాటడమెట్లా?"

అనీ అనుకుండగానే ఆనది ఓ చిన్న పాట పాడింది ఇలా

"ఏం సాధిస్తారు విచారంతో

కొట్టుక పోకండీ కష్టాలతో

ఆ పెద్దాకు మీద తెప్పలాగ తేలచ్చు

ఆపదలు దాటి వాలుగాలిలో దరిచేరవచ్చు."

ఆ పాట విన్న వారిద్దరికీ అపాయంలో ఉపాయం తట్టింది. ఓ పెద్ద ఆకును నీటి మీద వేసి ఎగిరి ఉరికారిద్దరూ దాని మీదికి. వరద జోరుకావడాన పట్టుతప్పింది. ఇద్దరూ నీటిలో బుడుంగు మన బోయారు. " మునిగి పోతున్నాం కాపాడండర్రా!" అని అరిచారిద్దరూ. వాళ్ల బతుకు బాగుండీ ఆ నీటి మీద ఎగిరి పోయో ఓ తూనీగ చెవిన పడ్డదాకేక.

వాళ్లిద్దర్నీ ఆదుకోడానికి నిదానంగా నీటి మీద వాలిందా తూనీగ. దాని కాళ్లు చెరొకటీ గట్టిగా లంకించుకున్నాయి. ఎర్రచీమ-అరుణా. ఆ

నది ఆవలి ఒడ్డున వాటిని దింపి రివ్వున ఎగిరిపోయిందా తూనీగ తన దారిన.

తడి జుట్టు అరుణ విదిలిస్తోంటే నీటి తుంపర్లు పడి " ఎవరూ? నీ మీద నీళ్ళు చల్లిన పోకిరి వాళ్లు?" అని అరిచాడు ఓ ఆకుమీద కూచున్న తెల్ల గడ్డం తాత.

" ఆహాహా! తమరేనా ఆ గొప్పమునీ! నన్ను పిరికిదాన్ని కాదన్నారు మీతమ్ముడు. మీరన్నా చెప్పండి- నాకెట్లా ధైర్యం అబ్బుతుందో! చెప్పి పున్నెం కట్టుకోండి బాబూ!" అని అరుణ వంగి దణ్ణం పెడ్తూ అంది. అరుణను ఎగాదిగా చూసి ఆ తాత ఇలా అన్నాడు" ధైర్యం లేకపోవడమే పిరికితనానికి మూలం"

" అయితే ధైర్యం ఎలా ఉంటుంది?" అంది గంభిరంగా అరుణ . "నాకంత బాగా తెలియదు." అనన్నాడా తెల్ల గడ్డం తాత. "ఆ పెద్దపొడుగాటి గడ్డం తాత మీరుకాదన్న మాట" అని అరుణ అంది " ఆహా! కానే కాదు! ఆయన మా పెద్దన్న. నాకు తెలిసింది రవ్వంత. ఆయనకు బోలెడంత తెలుసు." అని సర్ది చెప్పాడా తెల్లగడ్డంతాత. " అబ్బబ్బా! దుంపతెగిందే! ఆ పెద్దముని ఎక్కడుంటారో చెప్పండి మరి!" అని ఇద్దరూ బతిమాలుకున్నారా తాతను. ఆ పొద దాపు నుండే ఆ కోడి పుంజు నడగండి," అని జవాబిచ్చాడా తాత.

నడిచీ నడిచీ ఆ కోడి పుంజును సమీపించి " ఆ పెద్ద ముని ఎక్కడుంటారో" అని బిగ్గరగా అరించిందా చీమ. " మొరటు దానివి లాగున్నావే నీవు? అట్లా అరుస్తావేంటి- మాటా మర్యాదా అంత మాత్రం తెలియదా? నీకు జవాబు చెప్పను పో!" అని ఆ పుంజు జవాబిచ్చింది.

"ఓ అమ్మాయీ! కట్టుబాటుగా నీవున్నావు. అందుకే నీకు చెబుతా- ఆయనఎక్కడుండేదీ ఆ ఎత్తయిన పర్వతం మీద!" అని ఆ కోడి పుంజు అంది అరుణతో.

ఆ కోడి చేసిన మేలుకు వందనాలు చెప్పింది అరుణ.

ఆ పర్వత పాదం వద్ద కెళ్ళి పైకి చూశారిద్దరూ. అబ్బో! ఇవేం పర్వతాలు! ఇవెక్కడం ఎవరితరం!" సులువుగా పైకి పోయే సదుపాయం ఏమిటా ఽ. ఆలోచిస్తూ చడీచప్పుడు చేయక కాలి కొనవేళ్లమీద మెల్లగా నడుస్తూ ఓ ఆకు మీద కునుకు తీస్తున్న కందిరీగను చేరా రిద్దరూ.

గబుక్కున కందిరీగ కాలు వాటేసుకుందా చీమ. దాని రెక్క ఒకకొ గట్టిగా పట్టుకుంది అరుణ. ఇద్దరూ చిన్నగా దాని వీపు మీదికి చేరారు. అందుతో ఉక్కిరి బిక్కిరయి ఉలిక్కిపడిన కందిరీగ సూటిగా నింగిలోకి రివ్వున ఎగిరింది. ఆకాశ ఓడలాగా ఆ పర్వతం పై పైకి లేచిందా కందిరీగ. కిందికి చూసి అరుణ గజగజా కంపించింది. అయితే ఆ పెద్ద మునిని చూడబోతున్నామనే ధైర్యంతో సంబరాలు పడ్డారిద్దరూ.

పర్వత కొనకు రాగానే కందిరీగ వీపు నుంచి ఆ ఇద్దరూ దూకారు. చుట్టూ కలియజూశారు. అక్కడెవరూ ఉన్నజాడ కనుపించనే లేదు." ఓహో! ఆ పెద్ద మునీ! తమ రెక్కడున్నారు. ఎంత వెదికినా తమరు కనుపించరు!" అని పెద్దగా కేకలేసారిద్దరూ.

పర్వతాల్లో ఆ కేక మారుమోగింది. అదంతా చూసి దడుచుకుని ఏడ్చింది అరుణ. పక్కనే ఉన్న అడవి పచ్చపువ్వుకి జాలేసి, " నా కెరుకే. ఆయనెక్కడుండేదీపయరగాలి వీస్తే నా పిల్లలు ఆయన వద్దకు మిమ్మల్ని తీసుకుపోతాయి. ఏడ్వకండి! సాయం చేస్తాం "అని అంది.

ఉదయం చల్లగాలి వీచే దాకా ఎంతో ఉగ్గపట్టుకుని ఆగారిద్దరూ. ఆ పూరేకలన్నీ పిల్లలయి వాళ్లిద్దర్నీ గిరిక్కిన పర్వ కొనకు తీసుకుపో తున్నాయి. మామూలుగా భయపడే అరుణ ఈ సె ఽ ఆనందంతో నవ్వ సాగింది.

ఆ పూవు పిల్లలు వాళ్లిద్దర్ని పర్వత కొనకు చేర్చాయి. అంతలో ఆ పెద్దముని వాటి ముందుకు పొడుగాటి గడ్డంతో వచ్చాడు.

వాళ్లిద్దర్నీ చెరో చేత్తో పట్టుకుని అల్లిబిల్లి తిప్పాడు. చెట్టాపట్టాలాడుతూ తియ్యటి కబుర్లలోకి దించాడు. "శూరులు వొస్తున్నారని ముందే తెలుసు!!" అని అంటూ ఆట పాటలతో వాళ్లను కిలకిలా నవ్వించాడు.

"కాదు! కాదు! పిరికిదాన్నంటారు అందరూ నన్ను! అయితే మీరు ధైర్యశాలులంటున్నారు. అదెట్లా!" అంది అరుణ.

"మీ సాహస యాత్ర అందుకు ఉదాహరణ. ఎన్నో కష్టాల్ని ధైర్యంతో ఎదుర్కొన్నారు. అందుచేత పిరికి తనం పోయింది. ధైర్యవంతులయ్యారు." అలా ఆ గొప్ప ముని అంటూండగానే అరుణ నెత్తిమీద టోపీ లాగేసుకుందా ఎర్రచీమ. వెంటనే అరుణ అసలు రూపంతో జామ చెట్టు కింద నిలిచి దాని బోదె మీదికీ మీదికీ పాకి పోయే ఎర్రచీమను చూస్తోంది. ఆ గొప్పముని మాయమయ్యారు. ఆ తరవాత మరెప్పుడూ దేనికీ అరుణ భయపడితే ఒట్టు.

***

# కోయిల పాట

"బొమ్మలూ, బూరలూ, బుడగలూ అన్నీ నాన్న చెల్లికి తెచ్చిచ్చారు. మరి నాకేమీ ఇవ్వలేదు!" అనంది చిన్నారి జానకి.

"రేపు తిరునాళ్ల కెళ్లి బిస్కట్లూ, చాక్‌లెట్లూ, చెరుకు గడలూ, కొండ పల్లి బొమ్మలూ! ఇంకెన్నో" అని ఊరించింది. అమ్మ.

"ఇంకా..పువ్వులూ, పండ్లూ అన్నీ కొనుక్కుందాం" అంది అమ్మ.
"మరే, నాకో బుర్రు పిట్ట కొనిపెడతానంటివే అమ్మా?" అనడిగింది జానకి.

"సరే! అలాగే, కంచంలో అన్నం చల్లారిపోతుంది. దుమ్ముపడ్తుంది. తొరతొరగా తినమ్మా! మా తల్లివి కదూ! జానకీ!"

"ఓ పిట్ట కథ చెబుతూంటే, ఊ కొడుతూ, గుటుక్కున మింగుతా!"



"మన దేశానికి ఉత్తరాన ఎత్తయిన మంచు కొండలున్నాయి. ఆ పెద్ద కొండల్లో కాశ్మీరు ఉంది. ఆ దేశాన్ని ఏలే రాజుకు ఓ చక్కని మేడ. దానికి చుట్టూ ఎటు చూసినా పూతోటలూ, పళ్లతోటలూన్నూ, వాటిలో రక రకాల రంగురంగుల గులాబీలూ, చేమంతూలూ, మందారాలూ మరెన్నో పళ్లతోటలూ చూడ కన్నుల పండుగగా ఉన్నాయి. ద్రాక్ష తీగల నుంచి గుత్తులు, గుత్తులుగా పళ్లు వేలాడుతున్నాయి. వీటిని చూసిన బాటసారుల నోళ్లూరుతున్నాయి. ఆ తోటల్లో పూల చెట్లూ, పళ్ల చెట్లూ కో కొల్లలుగా ఉన్నాయి. ఆ తోటల అందచందాలు చూడాలిసిందే గాని ఎవరూ మాటల్లో చెప్పలేకున్నారు."

" పిట్ట కథ చెప్పమంటే రాజు కథ చెబుతావేం! అమ్మా!"

" పిట్ట కథే చెబుతా, వినూ, తొందరపడకు!"

"ఆ పచ్చని తోటలో నడుమ ఓ అందమయిన మేడ. అందులోనే ఆ దేశపు రాజు హాయిగా ఉంటున్నాడు. దాని పాల రాతి గోడల మీద మన ప్రతి రూపాలు చూడొచ్చు సుమా! రాజ సింహాసనం అంతా ముత్యాల, రత్నాల మయం. అది ధగధగా మెరుస్తుంటే చూసే వాళ్లకు సంతోషం."

"ఆ రాజు ఆ అందాల మేడ విడిచి ఎప్పుడయినా ఆ తోటల్లోకి షికారు కెళ్లేవాడేనా, అమ్మా!"

" ఉహు! లేదు! ఆయన ఎప్పుడూ ఆ మేడలోనే వినోదాలు, వేడుకలూ జరుపుతుండేవాడు. ఒక్కసారన్నా సరదాకు ఆ తోటల్లో షికారు కెళ్లే వాడే కాడు. రాజమందిరంలోనే పూలకుండీల్లో పూలమొక్కలు పెంచుకుని చూసి ఆనందించేవాడు!.

" ఇక ఆ తోటల అందం ఎలా ఉండేదమ్మా!"

" అచటకు పోయి చూడాలిసిందే జానకీ! ఈ వేసవి సెలవల్లో ఆ సుందర కాశ్మీరు విలాస యాత్ర కెళ్లి చూద్దాం!.

" ఆ అపురూపమయిన తోటల నడుమ చక్కని సంస్సులు. అందులో నీరు పక్కనున్న మంచుకొండలు కరిగి ఎల్లప్పుడూ చిన్న సెలయేరులుగా

పరవళ్లు తొక్కుతుంటాయి. ఆ కొండలోయల్లో ఓ సరస్సు చూడముచ్చటగా ఉంది. దాని నిండా ఎర్ర తామరలు కెంపులు లాగా మిలమిలా మెరుస్తూంటాయి. ఆ ఎర్ర తామరల నడుమ తెల్ల హంసలు వయ్యారంగా ఈదుతూంటాయి. ఆ ఎర్ర తామరల సరస్సు ఒడ్డున ఓ ఎత్తయిన దేవదారు చెట్టు. ఆ చెట్టు కొమ్మల్లో ఓ చిన్నారి గూడు. ఆ గూటిలో ఓ నల్లని కోయిలుంది. ఆ కోయిల కుహు కుహు , కో, కూ అని కమ్మగా పాడుతూ ఉంది. ఆ పాటకు లయగా ఆ తోటలోని పక్షులు కుహు కుహు, కో, కో అని మారు పాడుతుండేవి.

గలగల పారే ఆ పిల్ల కాలవల్లో చేపలు పట్టడానికి జాలర్లు వలలతో వచ్చేవాళ్లు. అంతలో ఆ నల్లని కోయిల కుహు కుహు కో కో అని తియ్యగా పాట అందుకునేది. చేపలు పట్టి పట్టీ అలసిపోయిన వాళ్లు విశ్రాంతి కోసం ఆ సరస్సు గట్టున చతికిల పడేవాళ్లు. ఆ కోయిల పాటకోసం చెవి కోసుకునే వాళ్లు. బాటసారులు ఆ పాట వినడానికి ప్రత్యేకం అక్కడికి వెళ్లే వాళ్లు."

" అయితే అమ్మా! ఆ కాశ్మీరు కోయిలలు మన కోయిల కన్నా కమ్మగా ఎలా పాడతాయే?"

" అవి అక్కడి లేత చిగుళ్లు తిని, ఆ సెల యేటి నీళ్లు తాగి మత్తెక్కి అంత ఇంపుగా పాడుతుంటాయమ్మా, జానకీ! ఆ కోయిలల పాట విన్న వాళ్లు మళ్లీ మళ్లీ వినాలని అచటకు వెళ్లేవాళ్లు. ఆ పాటలతో ఉప్పొంగిన కవులు పాటలూ కావ్యాలు రాసి తియ్యగా పాడుతూ ఉంటారు."

" అమ్మా! మరయితే మనం తప్పక కాశ్మీరు చూసిరావలసిం దేసుమా! ఇక కథ చెప్పు!"

ఆ కోయిల పాటతో ఒళ్ళు పులకరించి ఓ కవి కూర్చిన పాట ఆ రా చెవిన బడ్డది.

"మధుర మధుర మయిన పాట

మకరందములు చిందించు పాట

వసంత రాణికి వేడుకలుగ వసుధ కోయిల పాడు ఇంపుగ"

" ఆహా! అదేం కోయిల పాట - అదేం విచిత్రం-ఆ కోయిల!

" నాతోటలోనే ఉందా! ఆశ్చర్యం! ఎర్రతామరల సరస్సు ఒడ్డున నిలిచి ఆ ప్రియమైన పాట వినవచ్చా! ఆహాహా! ఆ సంగతి నా కింతవరకూ తెలియదే!" అని ఆ కోయిలను గురించి సంబరాలు పడుతూ ఆ రాజు అటూ ఇటూ చూశాడు.

"మన తోటలోని కోయిల అదెంత హాయిగా పాటలు పాడుతుందో ఓసారి వినాలి. విని మరీ నిదుర పోవాలి నేడు. ముని సంజెవేళలోగా దాన్ని నా వద్దకు తప్పక తీసుకురావాలి. - మంత్రీ!" అన్నాడా రాజు.

" ఆ కోయిల ఏ చెట్టు మీదుందో, ఏమో, అది మనకు అంత తేలికగా చిక్కుతుందారాజా!"

" పో, పోయి ఎలాగయినా దాన్ని వేగమే పట్టుకొని రండి. అందాకా అగుపించకు!"

ఆ కోయిల కోసం సేవకులంతా ఆ తోటలన్నీ గాలించారు. అది వాళ్లకు చిక్కితేగా మరి!" అంతా మాకేం దొరకలేదని" తలలు తిప్పారు. ఎంతో దిగులు పడ్డారు.

కడకు ఆ కోయిల సంగతి అందర్నీ అడగడం ఓ చిన్న దాసి పిల్ల విన్నది." ఓ సామీ! నేనా కోయిలను చూశా- అదే ..మరీ.."

" దబ్బున చెబుదూ-అడిగినంత డబ్బులిస్తాం. కావాలంటే ఓ సంచి బంగారు కాసులిస్తాం!" అనన్నా మంత్రి.

" సరే! నా వెంట రండి- ఆ కోయిలను చూపిస్తా!" అందా బుజ్జిపాప.

ఆ అమ్మాయి ముందుదారి చూపిస్తుంది. ఎర్రతామరల సరస్సు దాపుకు చేరారు అంతా.

" అదిగదుగో! అదే! ఆ చెట్టు పంగాల కొమ్మల్లోని గూట్లో ఉంది ఆ కోయిల!" అందా పిల్ల

" ఓ అందాల కోయిలమ్మా! రామ్మా, రా! మాతో మా రాజుగారి మందిరానికి. నీ పాట వినాలని మా రాజు మురిసిపోతున్నాడు. నీ కాళ్లకు

బంగారు గజ్జెలు కడతాడు. రవ్వల కెంపుల దండ మెళ్లో వేస్తాడు. ఓ పెద్ద బంగారు పంజరం చేయిస్తాడు. నీకు కావలసిన లేత చిగుళ్లు కమ్మగా పెడ్తారు. రామ్మా! రా! వచ్చి హాయిగా పాడి మా రాజును జోకొట్టు- ఓ కోయిలమ్మా!"

అని దాన్ని దీనంగా బతిమాలారు.

" ఈ సుందర వనాన్ని దాటి దేవలోకం రమ్మన్నా రాను. కావలసిస్తే రాజునే ఇక్కడకు రమ్మనండి!" అందా కోయిల.

" ఆహా! మా రాజుగారి కోరికకు ఎదురు చెప్పకు. నీవు రాకుంటే మా దుంపతెగుతుంది. మా మీద దయతో రామ్మా! ఓ కోయిలమ్మా!" అని లాలన చేశారు.

" ఆ మంత్రిగారి మాటలతో ఆ కోయిల మనసు మెత్తబడింది. జాలి వేసింది. సరే! అలాగే! అంది "ఐతే ఎల్లకాలం రాజుగారి మందిరంలో ఉండను. ఈ చెట్టు నన్ను కన్న తల్లి లాగా కాపాడుతుంది. ఈ సరస్సు నా దప్పిక తీరుస్తుంది. "అంటూ అది రాజమందిరానికి బయలుదేరింది.

రాజుగారి కిటికీలో వచ్చి వాలింది కోయిల. గొంతెత్తి దిక్కులు పిక్కటిల్లేట్లు కుహూ పాటలు పాడింది. అంతా ఒళ్ళు మరచి ఆ పాటలో లీనమైపోయారు. " ఓ కోయిలా! నీకేం కావాలి? అడుగు! ఇస్తాం" అని రాజు అన్నారు.

"నాకేమక్కరలేదు. నా పాట విని మీరు ఆనందిస్తే, ఉప్పొంగి పోతే అదే పదివేలు! నా బుజ్జి గూటికి వెళతా సెలవు. " అందా కోయిల.

ఓనాడు ఆ కాశ్మీరు రాజుకు జపాను రాజు ఓ వింత బంగారు పిట్టను కానుకగా పంపాను. "కీ"ఇస్తే సరి అది ఎంతసేపయినా పాడమన్నపాట పాడేది. దాని మోజులో కోయిల సంగతి మరచిపోయారు. ఆ కొత్త బంగారు పిట్టను జనం వేలం వెర్రిగా గుంపులు గుంపులుగా వచ్చి చూస్తున్నారు. ఆ పిట్టకు 'కీ' ఇస్తే అది ఎంత సేపయినా విసుగూ విరామం లేకుండా వాగుతుంది.

క్రొంత కాలానికి ఆ పిట్ట పాట వినగా వినగా విసుగెత్తింది. " కొత్తొక వింత పాతొక రోత" అన్నట్టు దాని పాట వింటే రాజుగారికి తలనొప్పి పట్టుకుంది.

అలా రెండో వసంతం కూడా గిర్రున తిరిగి రాలేదింకా! జపాను రాజు పంపిన మర పిట్ట 'కీ' అరగిపోయి కీచు చప్పుడు చేయసాగింది. "ఛ. ఛ - ఆ పాడు పిట్టను అవతల గిరాటేయండి. నాకు తలనొప్పి ఎక్కువయింది." అని రాజు చీదరించుకున్నాడు.

రాజుగారి తలనొప్పి ఎన్నాళ్లకీ తగ్గితే ఒట్టు. అదో పెద్ద రోగంగా మారింది. ఆయన తెగ బాధపడుతున్నాడు. ఎన్ని మందులు వాడినా ఆ జబ్బు నయం కాలేదు. తెల్లవారితే మళ్లీ తమ మంచి రాజును చూడగలమా లేదా అని అంతా వాపోయారు.

" ఆ కోయిల వచ్చి పాట పాడితే బాగుండు" అని రాజు అనుకున్నారు.

'ఎమి చిత్రమో, ఏమో! కుహు కుహు! అని కమ్మని పాటతో రాజు మందిరం మారుమ్రోగింది.. " అమ్మయ్య! ఎంత హాయి!" అనన్నారు రాజు.

"తల్లీ! కోకిలమ్మా! వచ్చావా? వచ్చి నన్ను మళ్లీ బతికించావా?" అని ఆనందించిన రాజు కాసేపాగి " నీ కేం కావాలన్నా ఇస్తాం! కోరుకో-ఐతే నన్ను విడిచి వెళ్లకు. " అనన్నారు.

" మీరు హాయిగా ఉంటే అదే చాలు. అంతకన్నా కావలసిం దేముందీ! " ఇక్కడే ఉండి పోమ్మా కోకిలమ్మా!"అని జాలిగా వేడుకున్నా డారాజు. " ఆహాహా! మీకోసం రోజూ సంజవేళ వస్తా. ఆనందం కోసం పాటలు పాడుతుంటాను. అంతేకాని ఎప్పుడూ ఇక్కడ ఉండను. "సరే!నీ ఇష్టం!" అన్నన్నాడు రాజు. ఈ నాటికీ ఆ కోయిల పాట ఎర్రతామరల సరస్సు ఒడ్డున వినండి మీరూను!!!.

***

# బద్ధకానికి బుద్ధి చెప్పి

శనివారం ఉదయం పావుగంటలో లలిత ఇంటి లెక్కలు నాలుగూ సులువుగా చేసింది.

తన తరగతి పిల్లలకు అరటి పండొలిచి పెట్టినట్టు తెలిసేటట్టుగా చెప్పింది వాళ్లు చేయలేని లెక్కలు.

తన పనులు కాగానే తోటలో పువ్వు పువ్వు మీదా తేనె కోసం వాలే తేనె టీగల్ని ప్రేమతో పరిశీలనగా చూడ్డం ఆమెకు సరదా!

ఆ సాయంకాలం బడి గంట గణ గణ మోగింది. పుస్తకాల దస్తరంతో ఇంటికి గబగబా పరుగెత్తే ఆమెను ఆపి, " ఈనాడు మన తరగతి గదిని శుభ్రం చేయడం నీవంతు."అనన్నాడు తరగతి నాయకుడు శ్రీను.



ఆమెకు పనంటే విసుగు. ఐనా తన వంతు పని చేయడం తప్పదుగా మరి! చికాకుతో అదరా బాదరా చీపురు తీసుకుని గది వేగంగా చిమ్మింది. ఓ మూల చీపుర్ని గిరాటేసి మెల్లగా ఇంటి దారి పట్టింది.

"ఎక్కడదుమ్మక్కడే ఉంచిసరిగా ఊడ్చక ఇంటికి ఉడాయించరాదు". అని ఆమెను ఆపేశాడు శ్రీను. ఇదంతా చూస్తోన్న పంతులు గారు, " ఏం లలితా! అంత తొందరేం! మళ్ళీ గది చక్కగా చిమ్ము దుమ్ము లేకుండా. దేవుని కన్నా కూడా శుభ్రత ముఖ్యం. అపరిశుభ్రత మన విరోధి. చదువుల్లో మొనగాళ్ళు పనుల్లో కూడా ముందే ఉండాలి సుమా!" అని అన్నారు.

ఆ చీవాట్లతో మొగం ఎర్రబడ్డది. ముక్కు చీదుకుంటూ, కన్నీరు కారుస్తూ శుభ్రంగా గది ఊడ్చి ఇల్లు చేరింది లలిత.

ఇంట్లో అడుగు పెడ్తోన్న ఆమెను చూసి, " పాపా! ఎండేసిన కట్టెలు పగుల కొట్టి వంట పంచలో పెట్టమ్మా!" అని తల్లి పని పురమాయించింది. ఆ పనికి బద్ధకిస్తూ తనలో ఇలా అవుకుందామె. " గొడ్డలే దానంతటదే కట్టెల్ని పేళ్లుగా చేస్తే ఎంత బాగుంటుందో అబ్బా!"

అంతలో ఓ తెనెటీగ " బుజ్ బుజ్" మంటూ ఆమె చెవిదాపు కొచ్చి " నాకు తెలిసిందిలే నీ ఆలోచన! రా! నాతోరా! నీ కోరిక తీరుస్తా!" అని అంది. అది ఆలకించిన ఆ అమ్మాయి ఆనందంతో ఆ తేనెటీగ వెంట అందమయిన వసారా దాటి బయటి పూ తోట కెళ్ళింది.

అచట ఓ చిన్ని బంగారు బంగళా చూసిన ఆమె కళ్ళు మిలమిలా మెరిశాయి. ఆ తేనెటీగ చటుక్కున ఓ అందమయిన అమ్మాయిగా మారి ' "నా పేరు మధు. ఆడుకుందాం! రా!" అని ఫక్కున నవ్వింది. ఆ బంగళాలోని బాలికల్ని " రా! రాండి! లలితతో ఆడుకుందాం" అని పిలిచింది మధు. అది విని వాళ్లంతా రంగు రంగుల దుస్తుల్లో ముస్తాబయి కమ్మని పాటలు పాడుతూ చెంగు చెంగున గంతులేస్తూ లలిత చుట్టూ గుమిగూడారు. వాళ్ల అంద చందాలు చూసి ఆశ్చర్యపోయింది ఆమె. లలితా.

మధూల చుట్టూ చేరి తియ్యటి పాట లెన్నో పాడారా చిన్నారులు. వింత వింతనాట్యాలతో కన్నుల పండుగ చేశారు.

ముందు రవ్వంత జంకినా లలిత నిదానంగా వాళ్లతో కలిసి పోయింది. తానూ హాయిగా ఆడింది. పాడింది. అపుడు అమ్మ చెప్పిన కట్టెల సంగతి చటుక్కున గుర్తొచ్చింది. దిగులుతో అమాంతం ఆట ఆపివేసింది. "ఏమయిందీ! ఎందు కంత బిక్కమొగం పెట్టావ్!" అని అన్నారా సావాసగాళ్లంతా.

" పనంటే లలితకు నచ్చదు!" అని మధు అంది. అది విని పిల్లలంతా పెడ మొగాలు పెట్టారు. " లలిత సోమరి. ఇష్టం లేని పనులు చేయ కష్టపడుతుంది. పనులన్నీ ఇక వాతంటవే అయిపోతుంటాయి. వాటి మీద ఆమెకు పెత్తనం లేదు. అవే ఆమె మీద పెత్తనం చెలాయిస్తాయి." అని ఓ అమ్మాయి అనగానే " బలే! బలే!" అని అంతా చప్పట్లు చరిచారు. లలిత నోట ఏమాట రాక ముందే ఓ మిరుమిట్లు గొలిపే కాంతి ధగధగా మెరిసి వాళ్లందర్నీ తేనెటీగలుగా మార్చింది. అప్పుడవి " బుజ్ బుజ్" మంటూ రయ్యిన నింగిలోకి ఎగిరి పోయాయి. మునుపటి లాగే దిగులుగా ఉండి పోయింది లలిత -వాకిట్లో.

ఇంత గడిబిడి అయినా ఆమెకు పని తప్పనే లేదు. గొడ్డలి కోసం దాని దాపు కెళ్ళే సరికి దానంతటదే కట్టెల మీదికి గంతేసింది. ఆ కట్టె పుల్లలు నిలువునా చీలాయి. చిన్ని చిన్న ముక్కలయ్యాయి. వాటిని వింతగా చూసి నమ్మలేక ముక్కుమీద వేలేసుకుంది లలిత. ఆ కట్టె పేళ్లను వంటింట్లోకి తీసుకు పోదామనుకొనగానే వాతంటవే అక్కడకు చేరి కుప్పగా కూచున్నాయి. కాస్త నడుం వాల్చుదామనుకుందో లేదో మంచం మీదికి పరుపూ దుప్పట్లూ, దిండూ జరజరా వొచ్చి ఆమెకు పక్క పరిచాయి. మంచం మీద పడుకుండగానే దుప్పటొకటి బరబరా వొచ్చి ఆమె మీద పరచుకుంది. ఆ రేయి సుఖంగా నిదుర పోయిందాగొ. తొలి కోడి కొక్కోరుకో అంది. ఆమె నిదుర లేచే సరికి ఉతికిన దుస్తుల మడతలు సిద్ధంగా ఉన్నాయి. తల దువ్వింది దువ్వెన. మొగం తుడిచింది

తువాలు. గదంతా అందంగా అమరింది. తల్లి అంగడి కెడుతూ, " నిప్పు రాజేడం నీ వంతమ్మా" అని అంది. వంటింట్లోకి లలిత వెళ్లేప్పటికే కట్టెలు గలగలా మండుతున్నాయి. అమ్మ కోసం ఎదురు చూసీ చూసీ విసు గెత్తింది. అన్నం తిని ఆడుకోపోదామనుకుని కంచం ముందు కూచోని కూచోక ముందే అన్నం వేగంగా ఆమె నోట్లోకి ఎగిరి పడింది. ఆ తొందర కది మింగుడు పడక గొంతు పట్టేసింది. వేడి వేడిపాయసం ఆమె గొంతును తెగ కాల్చేసింది. ముల్లంగి ముక్కలు వడి వడిగా నోట్లో దూరు తున్నాయి. ఇంకేమీ మింగుడు పడక ఆమె కంచం ముందు నుంచి పోబోతుంటే ఆ ముల్లంగి ముక్కలు ఇంకా త్వరగా నోట్లో పడుతున్నాయి. ముల్లంగి ముక్కల మారాం తప్పించుకోడానికి అతి త్వరగా పరుగెత్తింది. ఉక్కిరి బిక్కిరయింది. అలుపు తీర్చుకుందామని వాలుకుర్చీలో కూలబ డింది. ఆ కుర్చీ మొదట మెల్లగా ఊగింది. క్రమ క్రమంగా దాని ఊపు ఎక్కువయింది. ఆమె కళ్లు గిర్రున తిరిగాయి. తట్టుకోలేక కుర్చీ నుంచి దిగుదామనుకుంది. అయితే ఆ ఊపు జోరుకి ఆమె జారి నేలకూలింది. ఆ ఊగే కుర్చీ మీద మండి పడింది. అయినా ఏం చేస్తుంది! దెబ్బ తగిలి బొప్పి కట్టింది. నొప్పున్నచోట చేత్తో రుద్దుకుంటూ బడికి నడిచి పోయింది. ఆ నాడు ఆదివారం. ఆట స్థలం ఖాళీగా ఉంది. బంతితో ఆడుకుందామనుకొనగానే ఆ బంతి కాస్తా ఆమెకు చిక్కక మున్ముందుకు దొర్లుకుపోయింది. బంతి వెంట ఆమె దౌడు తీసింది. బంతి ఇంకా జోరుగా ముందు దొర్లుకుపోయింది. పరుగెత్తి పరుగెత్తి అలసి పోయింది. అయినా బంతి అందితే కదా!బంతాట మాని చెట్టుకు గట్టిగా కట్టిన ఊయల ఊగుదామని మనసయింది. అది దానంతటదే జోరుగా ఉపందుకుంది.

ఊయల ఊపుకు హడలి పోయింది. అది నింగిలోకి దూసుకు పోయింది. " ఆగూ! ఆగు! ఊగింది చాల్లే!" అని అంటే అది ఆగితేగా! సోమరుల మాట లెక్క చేయదా ఊయల. ఒళ్లు వణికింది. పట్టుతప్పింది ఆమె గాలిలో తేలిపోతోంది. గాలిలో తేలిపోయిన లలిత మురుగు గుంటలో, "ధన్" మని పడి బురదలో కూరుకుపోయింది. కాసేపటికి ఎలాగో తెప్పరిల్లి చప్పున ఆ గుంట ఒడ్డునున్న తెల్ల గన్నేరు చెట్టు వద్దకు

మెల్లగా చేరింది. అక్కడొక రాతి తిప్పఎంటే దాని మీద చతికిలపడ్డది. తన ఆలోచనలు పురివిప్పాయి. సోమరి తనానికి తెగ నొచ్చుకుని వలవలా ఏడ్చింది. బద్ధకానికి బుద్ధి చెప్పాలని గట్టిగా అనుకుంది. అలా అనుకునీ అనుకుంటుండగానే మధు నవ్వుతూ వొచ్చి, " లలితా! ఇక నయినా ఇష్టంగా పనులు చేయాలి. బంగారు తల్లిగా!" అని ముద్దు పెట్టుకుని మాయమయింది.

ఆ చెరువు ఒడ్డునున్న నల్ల రాతి మీద బాగా జాడించి బురద దుస్తుల్ని ఉతికి చెట్టుకొమ్మకు ఆరడానికి కట్టింది. బాగా ఆరిన దుస్తుల్ని ధరించి పకపక నవ్వుతూ ఇల్లు చేరింది లలిత. వంట తొందరలో నున్న తల్లికి కూరలు కడిగి తరిగి సాయం చేసింది లలిత. తల్లి ఆశ్చర్యపోయింది బిడ్డ ఓర్పుకూ నేర్పుకూ. ' పని చేయడంలో ఎంతో సుఖం ఉందమ్మా! బద్ధకానికి బుద్ధి చెప్పా"!అని చిరుమందహాసంతో మురిసిపోతోంది లలిత!.

***

# అందరూ సేవకులే!

" ఈ దేశానికి రాజును నేను. అందరూ నా సేవకులే." అని విర్రవీగాడా రాజు. అతడి అహంకారానికి హద్దూ పద్దూ లేదు. అతడి ఆజ్ఞ మీరడానికి అంతా జంకేవాళ్లే. ఎల్లరూ అతని దాసులే. ఎవరూ అతని మాటకు అడ్డు చెప్పడానికి వీలు అసలే లేదు.

అతని చెలికాడు ముసలి వాడు ఓ నాడు నడవలేక కర్ర ఊతంతో ఆ రాజును చూడవచ్చాడు. వస్తూ కానుకగా మామిడి పళ్లు తెచ్చాడు. చిన్న నాటి స్నేహితుని చూసి సంబరాలు పడ్డారు." ఏం కబుర్లు? అంతా కుశలమేగదా! కర్ర పోటేసుకు వచ్చావేం?" నా పరిపాలన సాఫీగా సాగుతుంది. నే నాడింది ఆట, పాడింది పాట. అంతా నా సేవకులే. నేనెవరికీ నవుకర్ను కాను. గొప్ప రాజును నేనే!" విన్నావా?" అని అన్నాడా రాజు.

"రాజా మీ మాటలు ఔననను. నిజం చేదు. అవసరం వస్తే ఒకరి కొకరు సాయం చేసుకొనడం అబ్బురంగాదు. అది సబబు. ఒకరు అందరి కోసం. అందరూ ఒకరికోసం." అనే పెద్దల సుద్దులు పెరుగన్నం ముద్దలు.



అవి ఎల్లకాలం ఆచరించవలసిన అమృత వాక్కులు మరువకండి." అని ఆ మిత్రుడన్నాడు.

" అయితే సాయంకాలంలోగా నా చేత ఊడిగం చేయించు చూద్దాం నీ సత్తా? నా చేత అట్లా పనిచేయించగలిగితే వంద ఆవులనూ, వెయ్యి వరహాలనూ కానుకగా ఇస్తా!" అని రాజు అంటూండగా ఆ ముసలి మిత్రుడు తాను తెచ్చిన పళ్లను ఆయనకు ఇవ్వబోయాడు. అంతలో అతని చేతిలోని కర్ర జర్రున జారి అతడు నేలపయి కూలాడు.

అది చూసిన రాజు స్నేహితుని ఆదుర్దాగా ఆదుకుని లేవదీసి సేద దీర్చి చేతికి ఊతంగా కర్ర అందించాడు. " ఏం మిత్రమా! దెబ్బ తగిలిందా? నొప్పిగా ఉందా?" అని ఓదార్చాడు.

'ఫరవాలేదు! గండం గడిచింది. గొప్పవారి సేవలు అందుకున్నా. మీ ఆదరణకు కృతజ్ఞతలు. ఆపదలో ఆదుకున్న వాడు ఆప్త మిత్రుడు. సూర్యుడు సహితం లోకానికి వెలుగూ వేడీ సమకూర్చి సేవ చేస్తున్నాడు. క్షణం విశ్రాంతి లేక నియమ పాలన చేసే మంచి నౌకరు. అతడు లేకుంటే నేలపయి మనం ఐపు లేకుండా పోయేవాళ్లమే. అతడందరికీ సేవకుడంటారా? కాదంటారా?" అని అన్నాడా మిత్రుడు.

అది విని రాజు నాలుగా కరచుకుని " చెలికాడా! కనువిప్పు కలిగించావు! బుద్ధి వచ్చింది. సేవలో ఆనందం ఉంది. అధికారంలో మోయరాని బరువుంది. నా అతిశయానికి మన్నించు. వంద ఆవులూ, వెయ్యి వరహాలూ కానుకగా అందుకో!" అనన్నాడు.

" ఔనౌను! బాగా అన్నారు. ఆవులనూ, వరహాలను పేదలకు పంచిపెట్టు. బీదలను కరుణించు. ఇబ్బందులలో ఉన్న ప్రజలకు సేవ చేయండి. జీవితం ధన్యమవుతుంది." అని అన్నాడా సన్మిత్రుడు.

ఆ ఆవులతో పాటు ధన ధాన్యాల్ని పేదలకు పంచి పెట్టాడా రాజు. మిత్రుని మంచి మాటలకూ, సమయస్ఫూర్తికీ, తెలివి తేటలకూ సంతోషించాడు. అతణ్ణి తన కొలువులో మంత్రిగా మంచి సలహాదారుగా నియమించాడు. ప్రజల కష్టసుఖాలలో చేదోడు వాదోడుగా ఉండి న్యాయంగా కరుణతో పాలించాడా రాజు. ***

# శీను సింగారం

సీతమ్మ గారి శీనుకు ఆటలంటే ఉన్న సరదా శుచీ శుభ్రతా చదువూ సంధ్య లంటే బొత్తిగా లేదు. శుభ్రంగా ఉండమంటే అతడికి ఆముదం తాగి నట్టుంది. మంచి అలవాట్లు అలవరచుకోమని వాళ్లమ్మ పోరుపెట్టని రోజు లేనేలేదు.

"ఒరే శీనూ! నీళ్ల పోస్తారారా! ఆ కుళ్లు తోళ్ల లాంటి చొక్కాలాగూ విప్పేయ్! ఇలా అట్టకట్టిందేం తల! మళ్లీ ఇసుకలో ఆటలాడావా నీపని పట్టిస్తా! జాగర్త! ఒంటి నిండా ఈ మురికేమిటి? వాన నీళ్లో ఆటలాడద్దని ఎన్ని సార్లు చెప్పినా బుద్ధిలేదురా!" అని ఏకరువు పెడ్తోంది సీతమ్మతల్లి.

"ఓ నాడేమయిందంటే- కోతి కొమ్మంచి ఆడుతూ చెట్టు మీద నుంచి కింద పడ్డాడు శీను. చొక్కా లాగూ చినిగాయి. ఒళ్ళంతా దోక్కుపోయింది. అమ్మ ఎలాగూ తంతుందని ఆమె కంటపడకుండా మూలగదిలో కావడి పెట్టి మీద చతికిల పడి, " ఏం గొడవొచ్చిపడింది అమ్మతో-అబ్బా!



ఏదోక సాకుతో రోజూ చీవాట్లేగదా! ఓ ఎగిరే మాయ తివాసీ గనక నాకుంటేనా; ఓ సామిరంగా! ఎంచక్కా అడివికి ఉడాయిస్తా !" అని అనుకుంటుండగానే కావడి పెట్టె మూత గబుక్కున తెరచుకోవడం శీను వెనక్కుపడడమేమిటీ బుర్రగోడకు ఠంగున కొట్టుకోవడమేమిటీ! అన్నీ క్షణాల్లో జరిగాయి!

అంతలోనే ఓ పాత తివాసీ పెట్టెలోంచి బయటకు జరజరా జారుకుంటూ వొచ్చింది. అది చేతిలో ఆగదే! ఎగురుతూ, జారుతూ, పాకుతూ తెగ అల్లరి చేస్తోంది.

"నేననుకున్న తమాషా తివాసీ ఇదేనేమో! ఐనా చూద్దాం దీని చోద్యం!" అని శీను తివాసీపై కూచొని, " జై డింగరీ! పెద్ద అడవిలోకి పోవాలి!"అని అనుకొంటూండగానే తివాసీ నింగిలోకి రయ్యిన ఎగిరింది. కింద చూస్తే ఎన్నో ఊళ్లూ, తోటలూ, అడవులూ కొండలూ, కోనలూ, కాలువలూ, నదులూ ఎన్నెన్నో! అన్నీ దాటుతూ ఓ అడవిలో శీను దిగాడు.

అక్కడ చెట్లు దట్టంగా ఉన్నాయి. ఏవేవో పొదలూ, తీగలూ, గజిబిజిలా అల్లుకు ఉన్నాయి. ఓ కోతి కుటుంబం ఓ చెట్టు మీద షికార్లు చేస్తోంది. తోక ఓ కొమ్మకు మెలేసి ఒంటి కాలు మీద ఉయ్యాల ఊగుతోంది ఓ పిల్ల కోతి. ఎన్నో రకరకాల ఎర్ర మూతివీ, నల్ల మూతివీ, చిన్నవీ, పెద్దవీ కోతులు ఎగురుతూ, గెంతులేస్తూ, దుముకుతూ కిచకిచ లాడుతూ అల్లరి చేస్తున్నాయి. ఉన్నట్లుండి అబ్బాయి కోతి "అమ్మా! అమ్మా! అటుచూడెవరో! కోతి పిల్లాడు ఒకడు ఇక్కడ కొచ్చాడు. చూడ్డాని కెంతో వింతగా ఉన్నాడు. ఏదో రంగు రంగుల ఆకుల మీద కూచున్నట్టున్నాడమ్మా!" అనన్నది.

తల్లి కోతి కిందికి చూసి, " ఎవరో మనిషి పిల్లాడు!" అని " ఓ బుజ్జోడా ఎవరు నువ్వు! ఎలాగ ఇక్కడి కొచ్చావ్?" అంది. " నేను శీనును, మాది చాలా దూర దేశం. ఇక్కడి వింతలూ, వినోదాలు చూడొచ్చాను. మీతో ఆడుకో వచ్చాను. ఇక్కడే ఉండిపోవచ్చావు!" అనన్నాడు.

తల్లి కోతి, తండ్రి కోతీ, అబ్బాయి కోతీ చెట్లమీద నుంచి కిందికి దిగొచ్చాయి. తండ్రి కోతి:-" మనిషి పిల్లలు చాలా శుభ్రంగా ఉంటారం టారు. అయితే ఈ అబ్బాయి మురికి ఓడుతూ ఇంత రోతగా ఉన్నాడేమిటి! ఛీ , ఛీ, తన్ని తోలెయ్యి వాణ్ణి!" అనంది.

అబ్బాయి కోతి:- " అమ్మా, అమ్మా! వాడితో ఆడుకుంటానే!" అన్నది.

తల్లి కోతి:- " పాపం పసివాడు! దారి తప్పినట్టున్నాడు! దూరాన్నుంచి రావడం వల్ల మురికిగా ఉన్నాడు. మనింటికి తీసుకెళదాం."అనంది.

తండ్రి కోతి:-" మన బిడ్డలాగా శుభ్రంగా ఉండి, బుద్ధిమంతుడుగా నడుచుకుంటే సరే! లేకుంటే అప్పుడే తరిమేద్దాం! తరువాత నీ ఇష్టం!" అనంది.

అందరూ ఓ దట్టమయినా పొదలో ఆ కోతుల కొంపకు చేరారు. దాని పక్కనే ఓ కొండ వాగు గలగలా పరవళ్లు తొక్కుతోంది. తండ్రి కోతి విరిచిచ్చిన వేపపుల్లతో తల్లి కోతి శీను పళ్లు తోమింది. పుక్కిలించి ఉమ్మి వేయించింది. నాలుక పాచి గీచింది. మొగం కడిగింది. తండ్రి కోతి అట్టకట్టిన శీను జుట్టు అంట కత్తెర వేసింది. చిన్న పాపిడి దువ్వింది. గోళ్లు కత్తిరించింది. ఈ లోగా శీను పాతతివాసీ చుట్ట చుట్టి ఓ మూల గిరాటు వేసింది. తల్లి కోతి. ఒళ్లు రుద్ది నీళ్ల పోయడానికి మెత్తని పీచు తెస్తోంది. శీనుకు ఏడుపువచ్చేస్తోంది.

"ఇవెక్కడి కోతులురా బాబూ! నేనిక్కడ ఉండలేను," అనుకుంటూ వాగుదాటి అవతలికి అడవిలోకి పరుగెత్తాడు. అక్కడా ఇదే తంతు! తల్లి ఏనుగు గున్న ఏనుగకు తొండంతో నీళ్లు పోస్తోంది. అయితే ఆ పిల్ల ఏనుగు సరదాగా తన బుల్లి తొండంతో ఒళ్లు గీరుకుని తోముకుంటోంది. వాటిని చూసిన శీను కేరింతలు కొడుతూ సంబరాలు పడుతూ " బలే! బలే!" అని చప్పట్లు కొట్టాడు.

అంతలో పైన చెట్టు మీద పెద్ద పాము ఒకటి " బుస్, బుస్" మంది. "అమ్మయ్యోయ్! చచ్చానురా బాబూ!" అని పరుగులంకించుకున్నాడు శీను.

దూరాన పొదల్లో రెండు కళ్లు మిల మిలా మెరిశాయి. అది శీను నిలిచి చూశాడు 'బాబోయ్! సింహం!' అని పెద్ద కేక పెట్టి ఓ చెట్టు ఎక్కబోయాడు శీను. అదేమయినా కోతికొమ్మంచి ఆడేందుకు జామా, మామిడీ చెట్లు కనకనా! కాస్తలో జారి పడేవాడే! సింహం అవులించి, ఒళ్లు విరుచుకుని, దుమకడానికి సిద్ధమవుతూంది. శీనుకు ముచ్చెమటలు పోశాయి! గజగజా వణికిపోయాడు. ప్రాణం గుప్పెట్లో పెట్టుకున్నాడు.

అప్పుడు ఎవరో తటాలున శీను నడుము గట్టిగా పట్టుకుని పై కొమ్మమీదికి లాక్కున్నారు. వాడు కళ్లు నులుముకుని చూస్తే - కోతులు మూడూ తప్పిపోయిన శీనుని వెదుక్కుంటూ వచ్చి సింహం బారిన పడకుండా కాపాడాయి. శీను తల్లి కోతి మెడ గట్టిగా కౌగిలించు కున్నాడు. సింహం తన ఎత్తులు పారలేదనుకుని నిరాశతో పొదలలో దూరి ఎక్కడికో పోయింది.

తల్లికోతి:-" ఏం నాయనా! శీనూ! అడవి చూడాలని ఉబలాటంగా ఉంటే మేం తీసుక వెళ్లమూ! నీళ్లు పోసుకుని, బువ్వ తిన్నాక వెళ్లాలి కానీ, తోడులేక ఒంటరిగా పోరాదు! ఎంత ఆపద తప్పింది!" అని ఒళ్లు నిమిరింది. ఇంటికి తీసుకు వెళ్లి చక్కగా నీళ్లు పోసింది. ఏవో ఆకులూ చెట్టు పట్టా కట్టు బెట్టింది. వాడి చొక్కాలాగూ ఉతికి ఆరవేసింది.

తండ్రి కోతి తెచ్చిన పళ్లూ, కాయలూ, దుంపలూ శీనుకు పెట్టింది. అవి తినడం వాడికేం తెలుసు మరి! పిల్ల కోతి పండ్ల రసమూ అవీ వంటి మీద పడకుండా ఎలా తినాలో నేర్పింది. ఆకలి మీద వాడు తనకు పెట్టినవన్నీ బంగారు కొండలాగా అల్లరి చెయ్యకుండా తిన్నాడు.

తల్లికోతి చెట్టు కొమ్మకూ, కొమ్మకూ కలిపి ఉయ్యాల వేసింది. అందులో మెత్తని ఆకులూ, ఎండుగడ్డీ, ఏరి తెచ్చి పరచింది. దాని పైన మళ్లీ పెద్ద పెద్ద ఆకులూ, చెట్ల మెత్తని పట్టా వేసింది. శీనును ఉయ్యాలలో పడుకోబెట్టి జోకొట్టింది.

శీనుకు నిదుర రాగానే తల్లి కోతి ఎక్కడి నుంచో సూదీ, దారం తెచ్చి వాడి చొక్కాలాగూల చినుగులు కుట్టింది. పిల్లకోతి దారాల ఎపట్టి అవీ

" జై డింగరి! మా ఇంటికెళ్లాలి!" అనంటూ చీకటి భయానికి గట్టిగా కళ్లు మూసుకున్నాడు. టకీమని నుదురు పెట్టె మూతకు కొట్టుకుంది. తివాసీ కోసం చుట్టూ చూశాడు. అయితే అదంతా కలే అని అనుకున్నాడు. వాడు కళ్లు తెరిచే సరికి ఎదురుగా దీపం పట్టుకుని తల్లి. తనేమో ఒక చేత్తో మిణుగురు పురుగుల సీసా పట్టుకున్నాడు. మరో చేత్తో పెట్టెలోంచి సగం ఇవతలున్న తివాసీ అంచు గట్టిగా పట్టుకుని ఉన్నాడు.

తల్లి" ఈ మూల ఏం చేస్తోన్నవురా వెధవాయ్! నీకోసం ఊరూవాడా గాలించలేక కాళ్లు కండెలు కట్టాయి. చస్తున్నా." అంది కన్నీళ్లు కారుతున్నాయి. శీను ఏడుస్తున్నాడు.

" అమ్మా! ఇంకెప్పుడూ వెళ్లనమ్మా! కొట్టకమ్మా! అయ్యతో చెప్పకమ్మా!" అంటున్నాడు.

సీతమ్మ కొడుకును అక్కున చేర్చుకుంది. ముద్దు పెట్టుకుంది. కళ్లు తుడిచి, " వెర్రినాగన్నా! అన్నం తినక నిద్దరోతున్నావా? కాళ్లూ చేతులూ, ముఖం కడుక్కురా, అన్నం తిందువుగానీ!" అంది.

మారాం చెయ్యక శుభ్రంగా కాళ్లూ చేతులూ కడుక్కుని, మురికి బట్టలు విప్పేసి వేరే ఉతికిన చొక్కా లాగూ తొడుక్కున్నాడు. హాయిగా అన్నం తిని పడుకున్నాడు.

" ఏమనుకున్నారు- నా బిడ్డ బంగారు కొండ! అపుడప్పుడు అల్లరి చేస్తే మాత్రం ఏం!" అంటూంది సీతమ్మ." మరే! నీ కొడుకెంత బుద్ధిమంతుడూ! అంత మురికి వాడింకెవరూ లేరుగా!" అంటూ తండ్రి లోనికి వస్తున్నాడు. శీను కళ్లు తెరిచి, " కాదు- నాన్నగారూ! ఇటు చూడండి. ఎంత శుభ్రంగా ఉన్నానో! కోతి తల్లి నన్ను మెచ్చుకోవద్దూ మరి!" అన్నాడు.

" కోతి తల్లి ఏమిటిరా? నీ తలకాయ?" అని తల్లి అంది.

"కాదులే అమ్మా! వాళ్లు నా స్నేహితులు. అంత మంచి వాళ్లను ఎవరినీ చూడలే"దంటూ నిదుర పోయాడు శీను. ***